శృంగార గ్రంథమాల ౪

# శృంగార భల్లాణచరిత్ర

[illegible]

గంగాధరకవి ప్రణీతము



ప్రకాశకులు:
జి. యస్. శాస్త్రి అండు కో.,
మద్రాసు.

# సర్వస్వామ్య సంకలితము



ప్రథమ ముద్రణము

లండన్ రాయల్ యెడిషన్

1928

చెన్నపురి

సమదర్శిని కార్యాలయమున

ముద్రితము



జంగము – వేశ్య

# పత్రిక.

జాను దెనుఁగు నుడికారముల సొంపు పెంపొంద, శివభక్తుల చరిత్రములను ద్విపదలుగా దొలుదొల్త రచియించిన మహాకవి, పాల్కురికి సోమనాథుఁడు. ఆతని రచనములయందు సూచింపఁబడిన యొక శివభక్తుని గాథావేశమే యిట్లు భల్లాణ చరిత్రమను పేర ద్విపదరచనముగా వెలసినది. ఈ రచనమునకుఁ గృతికర్త.

చితారు గంగాధరకవి, సిరియాళ చరిత్రమను కృత్యంతరమున నీతడు వెనవెల్ల గంగాధరుఁడని కలదు. వీరిద్దఱును, వీరయ్యామల్లమాంబికలనే, తలిదండ్రులనుగాఁ బేర్కొన్నారు. రెండును శివభక్తుల చరిత్రములు; ద్విపదలు; రచనమునఁ జాలపోలిక గలవి; కాన, వీరిరువురు నొక్కరే యగుదురు. వెనవెల్ల యీతని గ్రామనామమును, 'చితారు' ఇంటిపేరును,

కాఁదగును. రచనమునుబట్టి, యితనిఁ బదునేడవ శతాబ్దమునకుఁ జెందినవాఁనిగ, నూహింపదగును.

## భల్లాణ చరిత్ర.

సింధు కటకాధీశుఁడగు, భల్లాణరాజు చరిత్ర మిందు వర్ణిత మైనది. భల్లాణుఁడు శివభక్తాగ్రేసరుఁడు, జంగము లేది యడిగిన లేదనక యిచ్చుటకు, దీక్షఁబూనినవాఁడు. ఇతని శక్తిని, బరీక్షించుటకై శివుఁడు, విటజంగమ రూపై యితని యొద్దకు వచ్చి సంభోగార్థము, వేశ్యను గూర్పఁ గోరినాఁడు. శివుని మాయచే వేశ్య యొక్కతె యైనఁ బట్టణమున లభింపమిచేఁ దనపత్నినే వేశ్యనుగా నాజంగమున కర్పించినాఁడు రాజు. శివుని డాతని దీక్షకును, తెగువకును, భక్తిని మెచ్చి, యాతనికి సాయుజ్యము నొసఁగినాఁడు. పాల్కురికి సోమనాథుఁడు పేర్కొన్న శివభక్తులందఱు చరిత్రలందినవారే. ఈభల్లాణుఁడు సైత మట్టివాఁడే యగును. ఇది భావి పరిశీలనమువలనఁ దేలఁ గలదు.

ఈ పరమభక్తాగ్రణి చరిత్రమును బెఱువు రితరకవులు ప్రబంధములుగను, నాటకములుగను, దండకములుగను రచియించినారు.

## వి శే ష ము లు.

గ్రంథమున 'కొలిపాక గంటలను' జంగములు దాల్చువారని కలదు. (చూ ౧౧ పే. చివ పంక్తి ( పశ్చిమచాళుక్యరాజయినసింహాబల్లహుని రాజ్యస్థానములలో, నీ కొలిపాక యొకపట్టణము; ఇది నిజామురాష్ట్రాంధ్రదేశమున నున్నది. . (చూ. బసవపురాణ పీఠిక పే ౬౧,౬౨) ఈ కొలిపాక శైవులకు రాజధాని. సుప్రసిద్ధ శైవాచార్యుఁడగు రేవణసిద్ధుని జన్మస్థానము. ఈపట్టణమున నాకాలమున జంగములు వాయించు కంచుగంటలు విరివిగాఁ బోఁత పోయుచుందురు.

ఈ గ్రంథము భక్తిరస ప్రధానమైనది. శృంగార మంగము గాఁగలది. ఇందు వేశ్యాశృంగారమును కవి సరసముగా సంతరించినాఁడు. ఇతఁడు లక్షణమును ఒకొకచో శబ్దస్వరూపమును

నైత మంతగాఁ బాటింపక పామరులకును సుబోధ

కముగ నుండునట్లు తేట తెలుఁగు మాటలతో దీనిని

రచియించినాఁడు.

ఈతఁడు ప్రాస యతిని వాడలేదు.

శృంగార గ్రంథమాలయం దిది నాలుగవ-

గ్రంథము, ఈగ్రంథమును, మున్నటివానివలెనే

సరసాంధ్రజన సమాదరణ పాత్రమై ఒకటివెంట

నొకటిగాఁ బ్రాచీన రచనములను బ్రకటింపఁ

బూనియున్న మా ప్రయత్నమును గొనలు సాగఁ

జేయునుగాక యని యాశించు చున్నాము.

| | |
|---|---|
| విభవ<br>వైశాఖశుద్ధ<br>పంచమి<br>మంగళవారము | ఇట్లు.<br>గంటి సూర్యనారాయణశాస్త్రి,<br>సంపాదకుఁడు. |

శ్రీః

# శృంగార భల్లాణ చరిత్ర

## అవతారిక

శ్రీ గురులింగ సంచితనిర్మలాంగ
భోగీంద్ర కేయూర పుణ్యసంచార
పరమకృపాశీల భక్తవిలోల
కరిరాజమదభంగ కామభస్మాంగ
నారాయణస్తోత్ర నగజాకళత్ర
వీరావతార యోవిధిగర్వదూర
నాకేశనుతపాద నాదవినోద
యోకాశికానాథ యోవిశ్వనాథ
యని యిట్టులాస్వామి నభినుతిసేసి
తనరంగ గురుపదధ్యానంబు సల్పి
కరమర్థి బసవన్నఁ గనుఁగొని మ్రొక్కి
శరణుల నర్చించి గణములఁ బొగడి
అన్నపూర్ణాంబను నాత్మలోఁ దలఁచి

శృంగారభల్లాణచరిత్ర

పన్నగధరు వీరభద్రుని గొలిచి
ఫాలాక్షు సోమేశుఁ బ్రార్థనసేసి
వాలాయముగ భక్తవరుల నుతించి
శ్రీపతిపండితుఁ జిత్తమం దెంచి
ప్రాపగు మంచనపండితుఁ దలఁచి
భవ్యుఁడౌ శ్రీచెన్నబసవనిఁ గొలిచి
సేవ్యుండు మడివాలు శేఖరుఁ బొగడి
మురియుచు సారూప్యమును బొందినట్టి
పరమపావనులైన ప్రమథులఁ దలఁచి
శివకవులనుతించి శివయోగమునను
గవితా విశేషంబుఁ గరమర్థిఁ బడసి
అరుసించి వీరేశు కర్పించుకొఱకుఁ
బొరి మించు భల్లాణభూవరుచరితఁ
దెనుఁగున ద్విపదగాఁ దెల్లంబుసేతు
ఘనులు ప్రస్తుతిసేయఁ గవిబుధుల్ మెచ్చఁ
బనిపూని శివభక్తిపరులు నుతింప
వినుపింపవలసీన విజ్ఞానపరుఁడఁ
బరమశివాచారభరితవర్తనుఁడ

# అవతారిక

గురులింగజంగమ కరుణాన్వితుండ
మనునిభ వీరయ్యమల్లమాంబికల
వరపుత్రుఁ డగువాఁడ వంశవర్ధనుఁడ
ఘనమైన చిత్తారు గంగాధరుండ
వినుపింతు నా నేర్చువిధమున మెఱసి.
భూమిపై సురరాజ పూజితంబైన
నైమిశారణ్యంబునం దొక్కనాఁడు
ఘనపుణ్యులగు శౌనకాదులు సూత
మునిఁజూచి సంతోషమున నిట్లనిరి.
పరమపావనులైన ప్రమథేంద్రవరుల
చరితలు మీవల్లఁ జవులుప్పతిల్ల
వినఁగల్గె లెస్సగా విజ్ఞానభక్తి
ననఘ, వేఱొకకథ నడుగంగవలయు
భావజహరుఁడైన పార్వతీవిభుఁడు
దేవాదిదేవుండు దీనులకెల్లఁ
దల్లియుఁదండ్రియై ధరకును డిగ్గి
భల్లాణరాయుని పణఁతిరత్నంబు
నడుగఁ గారణమేమి యానృపుఁడైన

శృంగారభల్లిణచంద్రి

మహిం మించు ముత్యాలమంటపంబులును
సంగడిబావులు సంబరంబిడెను
ముంగిళ్ల ముత్యాలముగ్గులు గలిగి
చూడ నింపగు సూర్యసోమవీధులును
వేడుక నింటింట వృషభధ్వజములు
దేదీప్యమానముల్ దేవాలయములు
నాదిక్కునను నొప్పు యజ్ఞశాలలును
లలితమై తనరెను లక్షగాదెలును
సలలితంబై యున్న శస్త్రశాలలును
ఎన్న గోచరమైన హేమకుంభములు
నున్నతసౌధంబు లుజ్జ్వలంబైన
మణిగోపురంబులు మణిమంటపములు
మణితోరణంబులు మణిమందిరములు
నారికేళాశోక నాగ పున్నాగ
వారిజ మందార వట బిల్వ తాల
జంబీర తింత్రిణి చందన నింబ
హంబాళ హింతాళ కాశ్వత్థ బిల్వ
బదరికా ఖర్జూర పనస రుద్రాక్ష

ప్రథమాశ్వాసము

కదళికా కురువింద ఘనసారకములు
మొదలైన బహువృక్షములచేత సమ [illegible]
పదివేల శాఖలై ప్రబలిపుష్పముల
ఫలముల మధురసభరితమై యున్న
చిలుకలు వీక్షించి చేకొని [illegible]
పలుకుచు నొక్కొక్క ఫలమును [illegible]
కలిగి తుమ్మెదలు ఝుంకారంబు [illegible]
తెలివైన సుమములతేనియల [illegible]
గలపక్షిరవముల కలకలధ్వనుల
వెలనొప్పు నుద్యానవనములు గలిగి
విలసిల్లు త్రిభువనవిఖ్యాతి [illegible]
బ్రహ్మాత్మజైనను భా [illegible]
బ్రాహ్మణమని యొప్పు [illegible]
దశరథాత్మజుకంటె ధరణిలో [illegible]
యశముచే వెలసినయట్టి [illegible]
జలనిధు లేడింటి [illegible]
నలరిన ధనవంతు [illegible]
బురుహూతుని మించిన [illegible]

# శృంగార భల్లాణి చరిత్ర

సురుచిరంబైనట్టి శూద్రసంఘములు
కిన్నర గంధర్వ గీర్వాణ యక్ష
కన్యలఁ గాదను కామినీమణులు
కరినైన నీక్షించి కరమునఁ బట్టి
పొరలింపఁజాలిన భుజబలోన్నతులు
బిరుదురాహుత్తులై పేర్కొని రిపులఁ
దరుమనోపినయట్టి దండిసాహసులు
కొదలేక కదలాడు కొండలోయనఁగ
మదమెక్కి తూగాడు మత్తేభములును
మెరసి పాఱుచునున్న మిన్నేరుదాటి
యురుకనోపినయట్టి యుత్తమాశ్వములు
వలనైన రంభ నూర్వశినైన గెల్వఁ
గల రాపురిని వారకామినీమణులు
వీర శైవాచార విజ్ఞానకలిత
కారుణ్యధారు లఖండితవ్రతులు
వదలని యతిశీలవ్రతముల చేతఁ
బదిలక్షలకునైనఁ బదికోట్లకైన
జంగమార్చనసేయు సద్భక్తవరులు

# ప్రథమాశ్వాసము

నంగలింగాంగులు నాచారపరులు
మారటరుద్రులు మహిం జూడంగలిగి
యారూఢముగం బట్టమంత యిబ్బంగి
నీశ్వరప్రీతిగా నిహపరాదులకు
విశ్వకర్మయును గావించినయట్టి
యాసింధుకటకంబు నతిసంభ్రమమున
వాసిగా నేలెడు వంశవర్ధనుండు
కరకరి రిపుగజకంఠీరవుండు
పరమోపకారుండు బహుదానపరుండు
సంగరవిజయుండు సత్యసంధుండు
జంగమతీర్థప్రసాదసేవకుండు
వనధి గంభీరుండు వరగుణోజ్జ్వలుండు
జననాథుండాహరిశ్చంద్రవంశజుండు
భసితత్రిపుండ్రుండు భక్తవర్యుండు
రసికుండు భల్లాణరాజశేఖరుండు
అతనికి నిజరాణి యలికులవేణి
యతిముగ్ధ పూంబోణి యతివసామ్రాణి
పల్లవపాణి యా పరమకల్యాణి

చల్లమాదేవి నా సతిమణి గలదు
చల్లమాదేవికి సవతిరత్నంబు
మల్లికాదేవి యన్మానిని గలదు
ఇరువురు సతులతో నినకులేశ్వరుఁడు
సరసప్రవీణుఁడై సద్గోష్ఠినుండి
నిర్మలచిత్తుఁడై నెఱి నొక్కనాఁడు
ధర్మమార్గంబులఁ దలపోసి చూచి
రథికులు సేవింప రాజులు గొల్వ
నధికసంభ్రమమున నానంద మొంది
గురునిసన్నిధి కేఁగి గురునాథుఁగాంచి
శరణార్థియని మ్రొక్కి సద్భక్తి నిలిచి
కరమర్థిఁ గొనియాడి కణఁకతోఁ బలికె
వరపుణ్య, నాచిన్నవాక్యంబు వినుము
యొడయ లేమైనను నొనరంగ నడుగ
గడపక యొసఁగెడి ఘనబుద్ధి నాకుఁ
బొడమెను బొందియబొట్టు నానుడుట
కడఁకతో ధరియింపఁ గైకొంటి వ్రతము
నని యిట్లు భల్లాణుఁ డాడువాక్యములు

విని గురునాథుండు విస్మయంబంది
యాభక్తవరుఁ జూచి యప్పుడిట్లనియె:
ఓభూమినాయక, యో శిష్యవర్య,
యాసములోచను భూతి నందఁగారాదు
వసుధేశ, నీ కింతవైరాగ్యమేల?
యిప్పటితాత్పర్య మెల్లకాలంబు
నొప్పఁగా నిలువ దో యుర్వీశ, వినుము
వరశిష్యుఁ డేపాటి వ్రతము దప్పినను
గురునాథునకుఁ జాలఁ గొదవ సిద్ధించు
నియ్యనోపుదుమని యిచ్చువారున్న
నయ్యలు మహనీయు లాసించి యేమి
యడిగిన లేదు పో యనరాదు సుమ్ము
కడుపునఁబుట్టిన కన్నియనైనఁ
కండలు కోసైనఁ గనులు తీసైన
గుండెలు తఱిగైనఁ గొడుకుఁ జంపైన
నిల్లాలి నడిగిన నివ్వఁగవలయు
వల్లభ, యింతటివాఁ డైతివేని
మఱి యందు మీభూతి మాచేత ననిన

# శృంగార భల్లాణ చరిత్ర

బసిఁడియా నివ్వాళిపళ్లెంబు నిచ్చు
క్రమమున నుదయించెఁ గమలబాంధవుఁడు
కమలముల్ వికసించెఁ గలువలు మొగిచె
వనితలు చరియించి వాడవాడలను
గనకకుంభములతోఁ గస్తూరిఁగలపి
యంగళ్ల వాకిళ్ల నలుకులుచల్లి
ముంగిళ్ల ముత్యాల మ్రుగ్గులువెట్ట
గంధర్వ యక్షులు గానముల్ సేయ
సంధ్యాది విధులను సరగునఁదీర్చి
పలికినపంతంబు భక్తసమితికి
వెలయింతునని మంచివేళలో లేచి
హాటకమయమైన యారాజు కొల్వు
కూటంబు నతిచిత్రకూటమై యొప్ప
నిగనిగ మెఱయు వినీలకంభములు
పగడంపుఁ దిన్నెలు బంగారుచికిలి
యచ్చకస్తురిగోడ లందు చిత్తరువు
పచ్చకర్పూరపుఁ బలుకుల మ్రుగ్గు
ప్రణుతింపరాని సోపానమార్గములు

# ప్రథమాశ్వాసము

మణిమయంబైనట్టి మదురులచూరు
చూరువెంటను బెద్దచుక్కలంతేసి
పేరైన ముత్యాలపేర్మి కుచ్చులును
కుచ్చులకొనలను గోమేధికములు
పచ్చలు కెంపులు పద్మరాగములు
నంతరాంతరముల నలర నిబ్బంగి
పింతలఁ గై సేసి వెలయు గవాక్ష
ములచేత విలసిల్లి మునుకొని హేమ
కలశంబులను మించి గగనంబుముట్టి
దినకరశతకోటిదివ్యదీప్తులను
గొనకొన్న యా రాజుకొలువుకూటమును
భూజనములు చూడ బురుహూతుఁబోలి
రాజిల్లు భల్లాణరాయఁడే తెంచి
వరరత్నభూషణావళులు దీపింపఁ
దరమైన కర్ణపత్రములు శోభింప
మకరకుండల రత్నమకుటంబు మెఱయ
వికసితవదనుఁడై విడెము సేయుచును
శివపదధ్యానియై శివయోగమునను

నవరత్నసింహాసనస్థుఁడై యున్నఁ
డెరఁగొప్ప ఛప్పన్న దేశాధిపతులు
ఇరువంకలను డాసి యిష్టమై కొలువ
హితులు మంత్రులు పురోహితులు సేవింప
నతివశిరోమణి యాకుఁ జుట్టీయఁ
గరకంకణాదులు ఘలుఘల్లుమనఁగ
సరసత్వమున సఖుల్ చామరల్ వీవ
బటుముష్టిగల జెట్లు పాదంబు లొత్త
బలములు సేవింప భట్లు నుతింపఁ
గల్లరి రిపుగజ కంఠీరవుండు
భల్లాణరాయుండు పలికెఁ బంతంబు:
వినుఁడి యాస్థానంబు, విశదంబుగాను
మనమున నే నొక్కమాట యూహించి
యనువొందఁ బలికెద నవనిలో నన్ను
నెనసిన వాంఛల నేమైనఁ గోరి
యడఁగనిజంగాని కలరఁగ నొట్టు
నడిగిన లేదన్న నాయొట్టు తనవు'
ననియిట్లు చాటింప నష్టదిక్కులను

ప్రథమాశ్వాసము

విని జంగమయ్యలు వేడ్క లింపొంద
మును లాదిగా దివ్యమూర్తులతోడ
జననాథు వీటికిఁ జనుదెంచువారు:
జడముడిబసవయ్య చంద్రచూడయ్య
విడిగంట చిక్కయ్య భీమలింగయ్య
పర్వతనాథయ్య పరమయోగయ్య
నిర్వాణసోమయ్య నీలకంఠయ్య
చరలింగదేవయ్య చన్నవీరయ్య
మరుళయ్య గురువయ్య మల్లికార్జునయ్య
బోడయ్య శివ్వయ్య పులిబోనమయ్య
మేడయ్య నందయ్య మెట్టసంగయ్య
విరుపాక్షదేవయ్య విశ్వనాథయ్య
కరపాత్రసిద్ధయ్య కనకాంబరయ్య
గురులింగదేవయ్య కోటీశ్వరయ్య
శరభయ్య మొదలైన జంగమ్మకోట్లు
కక్షపాలలు మంచి కనకదండములు
భిక్షపాత్రలు చిన్న పెద్దజోలెలును
కాలిపాకగంటలు కుఱుచదండములు

శృంగార భల్లాణ చరిత్ర

పులిచర్మములు దివ్యభూతిపూఁతలును
పదములగజ్జెలు పసిఁడిపావాలు
రుదురాక పేరులు రుద్రమాలికలు
యోగపట్టెలు మంచియోగదండములు
శ్రీ గురుమూర్తులై చెలఁగు శంఖములు
చిమ్మటవాద్యముల్ శ్వేతశుక్కములు
గుమ్మటిదండెలు కూర్మవీణెలును
పిడిగంటలును బెక్కుబిరుదువాద్యములు
బడిబడి కంచెలు బసవ టెక్కెములు
ప్రణవనాదమునించు బారిసంకులును
గణుతింప నీరీతిగల జంగమములు
పుడమి యీనినయట్లు భువియెల్ల నిండి
నడలింగమూర్తులై నగరంబుఁజొచ్చి
యారాజవరుఁజూచి యయ్యలిట్లనిరి:
యీరోగి, మాకు నభీష్టంబులైన
యన్నవస్త్రంబులు నాభరణములు
జున్ను నేయునుమంచి జుజ్జుపాయసను
ధనధాన్యరాసులు తగిన గ్రామములు

# ప్రథమాశ్వాసము

కనకాంబరాదులు కట్టువర్గములు
మాసీమలో లేని మణికుండలములు
రాసికప్పెరలును రాగిబిందెలును
హయగజరథములు నావు లెద్దులును
గయిచూఱగా మాకుఁ గలిగినకొలఁది
వినయోక్తితోఁ దేరవిడెము బూదియయు
కని యిట్టు లడిగిన యయ్యల కెల్ల
నెడపక నిచ్చలు నిచ్చుచు రాఁగ
నొడయలు సంతోషమొందుచునుండి
రంతట నొక్కనాఁడు డాదరమునను
సంతోషచిత్తుఁడై సంయమీశ్వరుఁడు
నారదమునియును నయ ముప్పతిల్ల
నారాజవరుఁగాంచి యభినుతిసేసి
రాజాధిరాజ, యోరాజ, సర్వజ్ఞ
భోజ కళాధామ, భుజబలభీమ,
గానశాస్త్రవిలోల, కవిబుధపాల,
భానుకులాగ్రజ, భల్లాణరాయ,
పుడమిలో నినుఁబోలు పుణ్యాత్ముఁడేఁడి

యడిగిన లేదు పొమ్మనక యయ్యలకు
నిచ్చగా నేమైన నీయఁ జూచితివి
మెచ్చితి నిను మూఁడు మెచ్చుల ననుచు
మాణిక్యమయమైన మహతియన్ చేతి
వీణియ శ్రుతిఁగూర్చి విశ్వేశుమహిమఁ
బాడంగ విని సోలి భల్లాణుఁడపుడు
వేడుకపడి చాల విస్మయంబంది
చాలుచాల్ బాపురే! సన్మౌనీ యనుచు
లాలనతో నిచ్చె లక్షహొన్నులను
కట్నంబు లిచ్చినఁ గైకొని తపసి
పట్నంబు వెలువడి భక్తిమార్గమునఁ
గైలాసమున కేఁగి కడుసంభ్రమమున
ఫాలాక్షు నిజరాణిఁ బార్వతిఁ జేరి
కరమొప్ప హస్తపంకజములు మొగిచి
శరణార్థిఁ జేసిన శాంభవి పలికె
నెక్కడనుండి మునీంద్ర, యీరాక
యక్కడ గలవార్త లన్నియు మాకు
వినుపింపుమన్న నావేసాలతపసి
వినుపింపఁ దొడఁగె నావృత్తాంతమెల్ల

శ్రీః

# శృంగారభల్లాణచరిత్ర

## ద్వితీయాశ్వాసము

ఓతల్లి, వినుమమ్మ, యుర్విపైనుండి
భాతిగా మిముఁజూడఁ బని కల్గెనమ్మ,
ఆ భూమిపై నున్న హరభక్తవరులు
వీభూతిధారులు విధికైనఁగాని
వెఱవకున్నటువంటి వీరశైవులును
దఱచుగా నున్నారు ధర పిక్కటిల్ల
మఱియొక శివభక్తు మహిమఁ జూచితిని
గరమొప్ప నాసింధు కటకంబు నేలు
భల్లాణుఁ డనురాజు భక్తి నుప్పొంగి
యుల్లంబు రంజిల్ల నొక్కచిత్తమున
నడుగని జంగాని కలరంగనొట్టు
నడిగిన లేదన్న నాయొట్టు తనకు

నని యిట్లు గర్వించి యాడంగ వినియు
వనజాక్షి యెఱిఁగింప వచ్చితి నీకు
నన విని పార్వతి యాశ్చర్యమంది
మునినాథుఁ గరుణించి ముదమున లేచి
వనితలు సేవింప వైభవోన్నతులఁ
దన విభుకడ కేఁగి తాత్పర్యమునను
గరమర్థితో మ్రొక్కి కఱకంఠుకనియె
హరినేత్రపూజిత యమరేంద్రవినుత
పురహార సర్వేశ భువనప్రకాశ
నరలోకమందార నామనోహార
సకలలోకాధార శరభావతార
యొకవార్త విని యేను నొనర నీకడకు
వచ్చితి నాపిన్నవాక్యంబు వినుము
మెచ్చిన నిచ్చెదు మేనైన సగము
ఇచ్చినఁ దప్పవదెంత యీవైన
మెచ్చనేర్చినయట్టి మీనాంకహరుఁడ
వింట నిన్నొక్కఁడు వెఱవక మోదెఁ
గుంటెన నిన్నింపెఁ గొసరక యొకఁడు

ఇంటఁ గావలియుంచె నెలమి నిన్నొకఁడు
కంట నిన్నొక్కఁడు కదిసి పూజించెఁ
గొడుకు నొక్కఁడు మీకుఁ గూరగాఁజేసెఁ
బడిరాళ్ల నువ్వెన వరుస నిన్నొకఁడు
తరమిడి సీమీఁద దండెత్తె నొకఁడు
గురుతుగా రోకటఁ గొట్టె నిన్నొకతె
ఘనతతో సుతునిగాఁగనియె నిన్నొకతె
వనిత ప్రాయము వచ్చి వలచె నిన్నొకతె
యెంగిలంబలి యిచ్చి యేనసె నిన్నొకఁడు
వెంగలిగా నిన్ను వెలివేసె నొకఁడు
బటువుగాఁ దొడలపైఁ బవళించె నొకఁడు
ఇటువంటి భక్తులు నెందైనఁ గలరె?
అటుగాక యింకొక యాశ్చర్య మిపుడు
నిటలాక్ష, భల్లాణ నృపతులోత్తముఁడు
ఎడపక జంగమం బేవస్తువైన
నడుగకుండిన నొట్టు నడిగిన లేదు
అనినచో నాయొట్టు నఖిలంబు వినఁగఁ
దనకని గర్వించి దండితో గంట

మొగసాలఁగట్టించి మ్రోయించుకొనుచుఁ
జిగురెక్కియున్నాఁడు సింధుపురమున
నాతని నిజభక్తి నలరంగఁ దెలియ
భూతేశ యట వేగమునఁ బోయిరమ్ము
అని విన్నవించిన యంబికమాట
విని నవ్వి శంభుండు వేడుకనొంది
నలినాక్షి సింహాసనస్థనుగాను
కొలువులోఁ దొడలపైఁ గూర్చుండఁజేసి
కరుణాకటాక్షుఁడై గౌరితో ననియె
గిరిజ, మాభక్తుల కీర్తిసాహసము
లరుదొంద హరికైన నజునికి నైన
శిరములు వేయున్న శేషునికైన
నిర్ణయింపఁగరాదు నిఖిలలోకముల
వర్ణింపఁదరమె యెవ్వరికైనఁగాని
నాకన్న నధికులు నాభక్తవరులు
లోకలోకములన్ని లోఁగొనఁగలరు
విధికైన వెఱవని వీరమాహేశు
లధికులు వారేమి యడిగినఁజెల్లు

వారెల్ల నింతేసివారౌట వినవె
వారిజగంధి నీవాక్యంబు వినియు
నూరకుండుట మాకు నుచితంబు గాదు
ఆరాజవరుభక్తి నలరంగఁదెలిసి
వచ్చెదఁ దోడ్కొని వామాక్షి, నీవు
నిచ్చట నుండు మీయింతులు గొలువ
నని యిట్లు సర్వేశుఁ డా గౌరిదేవి
మనసు సమ్మతిసేసి మహిమతోడుతను
హరివిరించ్యాదుల నటువీడుకొల్పి
సురలను బనిపుచ్చి సొంపుతోఁగొల్వు
పాలించి యంతట శర్వాణి పంప
కైలాసముననుండి గౌరీశ్వరుండు
పుడమికి వెస డిగ్గి భువనంబు లెఱుఁగఁ
గడువేగమున సింధుకటకంబుఁ జేరి
దీపింప రవికోటి దేదీప్యమాన
మహాపట్టణముఁ బొచ్చి యాశ్చర్య మంది
నిజరూప మటుమాని నీలకంధరుఁడు
భజనతో నారాజు పట్టణంబునను

వారకామినులున్న వాడలకేఁగి
వారకాంతలఁ బిల్చి వలసినధనము
నిప్పించి యొక్కొక్క యింతికి విటుని
నొప్పుగాఁ గావించి యుంచిన విటులు
కామినీమణులతోఁ గామభోగముల
శ్రీమంతులై యుండఁజేసి యాలోన
నుదయకాలమునందు నొప్పిదంబైన
పదివేలసూర్యులప్రభలు చెన్నొంద
విరుపాక్షుఁడును నొకవిటజంగమయ్యె
కురులు నున్నఁగ దువ్వి కొనగొల్లచేత
ముంగలిసిగ వేసి మురువుగాఁ గొనలు
చింగురంగులువార సిగను దామెతులు
పొగడపూవులదండఁ బొందుగాఁ జుట్టి
మొగలిరేకులు మాని మొల్లలు దుఱిమి
తెలివిగాఁ గస్తూరితిలకంబు దిద్ది
వలపుమై బూదియు వెన్నెగాఁ బూసి
బంగరుచెఱఁగుల పట్టుంచుదట్టి
చింగులువారంగఁ జెలువుగాఁ గట్టి

## ద్వితీయాశ్వాసము

యురుసజ్జలింగంబు నురమునఁ దాల్చి
మురుగుముద్రలు తీయమోవిపైఁగాట్లు
చెక్కుల శశివంక చిన్నారిగోళ్లు
వక్కలాకులసంచి వలెవాటుశాల్వ
చెంపలగంధంబు చేత నంకుశము
సంపెంగపూబంతి సరిపెణగొలుసు
లందె పెండెరము రుద్రాక్షమాలికలు
మందు కాటుకబొట్టు మణికుండలములు
నీలాలపోగులు, నిక్కుకన్బొమలు
వాలారుగోళ్లును వాఁడిచూపులును
బదముల సిరిగజ్జె పసిఁడిపావాలు
మదనవికారంబు మైనిండఁ గలిగి
మొల వంకకత్తియు ముంజేత జోలె
సెలవులఁ జిరునవ్వు చిన్నారిచెమట
వరశిష్యులై భక్తవరులు గొలువఁగ
మరులుగొల్పెడు విటమార్గుఁడో యనఁగఁ
బుక్కిటఁ దమ్ములంబుఁ బుష్పమాలికయు
నక్కడ నొకశిష్యుఁ డాకుఁ జుట్టియు

నాడాడ నొకశిష్యుఁ డద్దంబుఁ జూప
నీడఁ జూచుచు నంత నిలిచి మురియుచు
బలుతీరు ముఖకాంతి భావించి చూచి
మొలిగొన మీసాలు మెలిచి దిద్దుచును
నొఱపును మెఱపును నొయ్యారివగలు
విరియశంకరుఁడిట్లు విటరూపుఁ దాల్చి
లంజెలకాముఁడై లలితముల్ సేసి
మంజరిఁ జదువుచు మహిమతో రాఁగ
నాసీమజనులెల్ల నటు చోద్యమంది
యేసీమలోఁ జూడ మిటువంటివిటుని
నీవింత యీబాగు నీచక్కఁదనము
నీవన్నె యీపూఁత యీజాణతనము
నీనగ వీపెంపు నీసొంపు నీటు
నీనటనంబులు నీమగతనముఁ
గందుసందును లేని కళలను నిండు
చందమామను మీఱఁ జాలియున్నాఁడు
ఈజంగమును జూచి యెవ్వతె యైన
నోజమాలియు వెంట నుఱుకు నన్నారు

మనసు మెత్తనిదైన మగనిఁ బోవిడిచి
వెనువెంటనేపోవు వెలవ కన్నారు
పదిలము గలిగిన పణఁతియనైన
నదియేల పోయెడు ననియెడువారు
మానంబు గలయట్టి మానినియైన
యూని ద్రవింపక యుండ దన్నారు
ఈరాజఋషిఁ గాంచి యేసాధ్వియైన
కోరి తానయి చేరకుండ దన్నారు
వనితలగుణము లెవ్వరు కన్నవారు
మనసు పారకపోదు మగవానిఁ జూచి
మతిమంతుఁడై వేడ్కమనపురిఁ జేరె
నితఁడెవ్వఁడో కాని యెఱుఁగంగరాదు
చిత్తజుఁడేమొ యీచిన్నెలవాఁడు
చిత్తజుఁడయినను జెలఁకువిల్లేది
యింద్రుండు కాఁబోలు నీవగలవాఁడు
ఇంద్రుఁడైనను గన్ను లేవి మైనిండ
బ్రహ్మ కాఁబోలు నీబాగులవాఁడు
బ్రహ్మయైనను నాల్గుబాహులు నాల్గు

శిరములుఁ బుక్కిటఁజెలఁగదే వాణి
పరికింప నీతఁడు బ్రహ్మయుఁగాఁడు
జలజాక్షుఁడేమొ యీజాడలవాఁడు
జలజాక్షుఁడైనను శంఖచక్రములు
తిరుమణి కస్తూరితిలకంబు లేవి
యరయంగనీతఁడు హరియును గాఁడు
భల్లాణరాయనిభక్తి వీక్షింప
చల్లమా దేవమ్మ సత్యంబు నరయ
హరుఁడేమొ యీరూప మమరంగఁ దాల్చి
యరుగుచు నున్నవాఁ డవును దథ్యంబు
అని యిట్లు పురజను లాడునీలోన
మనసిజహరుఁడేఁగి మానవాధిపుఁడు
కొలువున్న మొగసాల గొబ్బునఁజొచ్చి
నిలిచియున్నంతలో నిజగురుఁగాంచి
భల్లాణరాయండు భక్తితో లేచి
యుల్లంబురంజిల్ల నొక్కచిత్తమున
శరణార్థియని మ్రొక్కి సన్నుతిసేసి
యరిమురి సింహాసనాసీనుఁజేసి

## ద్వితీయాశ్వాసము

యాదటనర్ఘ్య పాద్యాదుల నొసర్చి
పాదచారిగనున్న భల్లాణుఁజూచి
కక్షపాల విభూతి కరమునఁ బట్టి
పక్షమై ధరియింప భల్లాణుఁడనియె
నేను ధన్యుఁడనైతి నెల్లలోకముల
నేను ధన్యుఁడనైతి నిహపరాదులకుఁ
బన్నగా నేఁడు మీపాదపద్మములు
కన్నులారఁగఁ జూడఁ గలిగె నేఁడనిన
నారాజుక్షేమంబు నంతయు నడిగి
మారారి సంతోషమగ్నుఁడై యుండె
నావేళ మంత్రులు నాయయ్యవగల
భావించి వీక్షించి పరిభాష ననిరి
గురులింగ, యేభూమిఁగోరివచ్చితిరి
యొఱపును మెఱపును నోయ్యారివగలు
మురిపంపునటనయు మోవిపైఁగాట్లు
చిఱునవ్వు చెక్కిళ్లఁ జిన్నారిగోళ్లు
నల్లని పలుఁగఱ నకునెత్తి సిగయు
మొల్లపువ్వులదండ మొల్ల వంకకత్తి

చెంపలఁ గంధంబు చేతను సురఁటి
యింపును సొంపును నిది చరలింగ
నీకుఁ జెల్లునుగాక నిఖిలలోకములఁ
జేకొననొరులకుఁ జెల్లునే యనిన
చేతిలోఁ జేవైచి శివుఁడటు నవ్వి
చాతుర్యమునఁ బల్కె సభయెల్ల వినఁగ
ఘనతరంబగు తల్లిగర్భగోళమున
జనియించుటకు విశేషం బిది కాదె?
పారకాంతలఁజూచి వదలనేమిటికి?
కోరిక పారిన గుదెఁ బట్టనేల?
పంచేంద్రియంబుల బంధింపనేల?
ఇంచువిల్తునిబారి కీగంగనేల?
కలలోన సతులను గామించనేల?
స్ఖలితుఁడై కర్మలఁ గట్టువడనేల?
స్నానజపమ్ములు సలుపంగనేల?
కానలలోఁ దిరుగాడంగనేల?
పరదేసులై గుళ్లపంచలఁ జేరి
పొరలాడినందున్నఁబు పుణ్యంబు లేదు

## ద్వితీయాశ్వాసము

మదనకేళులయందు మమత లుప్పొంగ
ముదితల కుచకుంభములమీఁదఁ జేయి
వేసుక యతివీర్యవృద్ధులచేత
వేసట లేకుండ వేశ్యలుఁ దాము
వింతవర్తనముల వివిధబంధముల
సంతతరతికేళి సంయుక్తులగుచుఁ
బువ్వులశయ్యలపయి భోగభాగ్యములఁ
బవళించిన సుఖంబుఁ బరమంబు గలదు
కామశాస్త్రములందుఁ గామిగావచ్చు
కామిగానట్టి నిష్కలుషుఁ డెవ్వండు?
కామిగాఁడా తొల్లి గౌరీశ్వరుండు
కామిగాఁడా తొల్లి కంసమర్దనుఁడు
కామిగాఁడా తొల్లి కమలగర్భుండు
కామిగాఁడా తొల్లి కమలబాంధవుఁడు
కామిగాఁడా తొల్లి కలువలరాజు
కామిగాకయె మోక్షకామిఁ గాలేఁడు
ఈమాట విని నేను నీ రూపుఁ దాల్చి
వేమారు భక్తుల వేశ్యల నడిగి

పుట్టి నే విటుఁడనై భోగింతు నిత్య
రట్టడి సంగమరాజును నేను.
అనవినిమంత్రులు నౌనయ్య యనిరి
పనిపూని సెలవులు వారు నవ్వుచును
ఉన్న జంగముఁజూచి యుర్వీశుఁడనియె
అన్నివిద్యలు జంగమయ్యలసొమ్ము
జంగంబు నోరయుట సంగతికాదు
జంగంబు నాప్రాణ సల్లింగమూర్తి
జంగంబు నాపాలి సర్వేశ్వరుండు
లింగార్చనము సేయ లెమ్మని పలుక
జననాథుఁ గనుఁగొని జంగ మిట్లనియె
ననఘాత్మ! మారాక నర్థితో వినుము
అన్నంబుపై మాకు నాశయు లేదు
వెన్నెలతేటైన వేశ్య కావలయు
లంజెలేని దినంబు లక్షైనఁగాని
గంజి నోటికిఁబోదు ఘనుఁడ నీయాన
యున్నమాటలు మాకు యువిదఁ దెమ్మనుచు
విన్నవించిన రాజవిభుఁ డిట్టులనియె

## ద్వితీయాశ్వాసము

రావయ్య, జంగమరాజశేఖరుడ,
నావిన్నపము విను నా ప్రాణలింగ
యొడయ నీ కీమాట యుచితంబు గాదు
అడుగుము మఱియు నేమైన నిచ్చెదను
వెలయాలి నడుగంగ విహితంబు గాదు
అలిగి హాస్యము చేతు రయ్యలు వినిన
నీకుఁగోరికయున్న నింపుసొంపైన
శ్రీకరంబైనట్టి చెలువను దెచ్చి
పెండ్లి చేసెదఁగాని పెండ్లాడు మీవు
ఇండ్లు గట్టించి యుంతు మెల్లభోగముల
రాసిక పైరలు నా రాజ్యంబు వందు
వాసిగా నిప్పింతు వర్షాశనంబు
పెండ్లికి నొక్కొక్క పెద్దటంకంబు
ఇండ్లిడ్డవారిచే నీయఁ జేసెదను
వారక శివభక్తవరుల రప్పించి
వార మిప్పింతు నీవద్ది శిష్యులకు
పోకలు గొనకుండ పూని సాగితు
చేకొన నీలాగు చెల్లు నయ్యలకు

శృంగార భల్లాణ చరిత్ర

నిది నీకుఁ దగదన్న నేనేలు రాజ్య
పదవిలో సగపాలు పంచి యిచ్చెదను
నన్ను లాలన చేసి నామాట వినుము
ఉన్నిమాటలు మాను మోస్వామి యనిన
నామాట విని జంగమయ్య కోపించి
యేమిటి కీవార్త భూమిప, వినుము
పెండ్లేల, గిండ్లేల, పేరంట, మేల?
యిండ్లేల, గిండ్లేల, యీరవ్వయేల?
యాడేది యొక్కటి యనిమిలో నొకటి
కూడునే యిటులాడ గురునాథుతోడ
జగబిరుదము గాని సందు లీఁగెదవు
తగ దొట్టు నీకును ధరణీశ, మాను.
బండాటములు మాతో పచరింపవలదు
బండారు గొమ్మనిపట్టపు సెట్టి
యిలు చూర గానిచ్చు నీసామ్యమయ్యె
వెలయాంధ్రు నీయూర వెలితియైనారొ
పెండ్లిమాడల నోలిఁబెట్టి యొక్కతెను
పెండ్లిచేయుటకన్నఁ బృథివీశ వినుము

ద్వితీయాశ్వాసము

కాసుఁబెట్టిన లంజె కలదు చక్కనిది
కాసీయఁజాలక కల్లలాడెదవు
నాచేతి కాసైన నరనాథచంద్ర
నీచేత నందుక యీచేత నాకుఁ
దెప్పించు వేశ్యను దెలినైనదాని
తప్పకు శివభక్తి తడవేల యనిన
నొడయని మనసురా నర్వేశుఁడనియెఁ
గడువేగమున వారకాంతను మీకుఁ
దెప్పింతు నిప్పుడే దేవ నీయాన
యొప్పితి ననినను నొడయఁడిట్లనియె
జననాథ నామాట చక్కఁగా వినుము
పనికిమాలినదాని, బానిసదాని
నుర్వీశ తెప్పింప నొల్లను సుమ్మి
గర్వాంధురాలైన కాంత నేనొల్ల
మిక్కిలి పొడవైన మిగులఁగుర్చైనఁ
బెక్కుమాటలదైన బీదగొట్టైన
ఇచ్చ యెఱుఁగనిదైన నెడ్డదియైన
మెచ్చనేరనిదైన మొల్లచూపైన

నిడుదపండ్లదియైన నిద్రపోతైనఁ
బడుచండ్లదైన దూబరదిండియైన
బడపుడిగినదైన బడుగుదియైనఁ
గొడవపోతైన నిండుడు చండ్లదైన
చెండిపోతైనఁ దుచ్ఛపులాగుదైనఁ
గండక్రొవ్వినదైన గడుసురాలైనఁ,
జిడ్డుతలైనను జెమటకంపైనఁ
దెబ్బనోటిదియైన దిండిపోతైనఁ
జొల్లునోటిదియైన సోమరియైన
నల్లరూపుదియైన నాతి నేనొల్ల
వినయంబు లేనిదై వేడ్కలుమాని
ధనవంతురాలైన దాసి నేనొల్ల
విటునిచే ధనమంది వేఱె యొక్క
విటుకిఁ జేసాచు వేశ్య నేనొల్లఁ
గలహించి విటునకుఁ గౌఁగిలీయకయు
మలకలు వెట్టెడు మగువ నేనొల్ల
చెక్కిటఁ జెయి సేర్చి చిన్నవోవుచును
మొక్కలంబైయుండు ముదిత నేనొల్లఁ

## ద్వితీయాశ్వాసము

బసరమ్మువలెఁ బర్పుపైఁబవ్వళించి
బుసకొట్టుచున్నట్టి పొలఁతి నేనొల్ల
మదనకేళులయందు మన మింతలేక
వదరుచు నిద్రించువనిత నేనొల్ల
గూటము లీయక కుములుచు నట్టి
మాటలఁ బ్రొద్దగు మానిని నొల్లఁ
బురుషుఁ డలసినంతఁ బొదలుచు మీఁద
సురతంబుచేయునిసుదతి నేనొల్ల
చిత్తంబు నొరులపై జేర్చియున్నట్టి
చిత్తినిజాతైన చేడియ నొల్ల
కుస్తరించక విటు కొడువల నెన్ను
హస్తినిజాతైనయతివ నే నొల్ల
బొంకులకుంచమై పురుషునిరతుల
జంకించు శంఖినిజాతైన నొల్ల
పద్మాకరంబన భాసిల్లునట్టి
పద్మినిజాతైన భామ కావలయు
భవిఁ బిల్వనేరని పడఁతి కావలయు
శివభక్తురాలైన చెలియ కావలయు

రమణి యీరేశివరాత్రిగానన్న
క్రమమొప్ప వేగించుకలికి గావలయు
మఱి యిన్నిగుణములమానిని వలయు
ధరణీశ తెప్పింపు తగినట్టిదాని
నీ మన మొప్పిన నెలఁతయేదైన
నామనమొప్పును నరనాథచంద్ర!
అనవుడు వినియు రా జట్లకానిమ్ము
యనుచును సంతుష్టుఁడై తలవర్ల
రప్పించి యిట్లనె రాజశేఖరుఁడు:
యొప్పులకుప్పైన యొకవారకాంత.
కావలె విటుఁడున్నకలికి గాకుండు
తేవలె జంగమదేవర కిపుడు
యని యిట్లు భల్లాణుఁ డాడువాక్యములు
విని యటు తలవర్లు వేశ్యను వెదకి
తరలివచ్చిన యట్టి తదనంతర మునఁ
బరమాత్మ నిజరాణి పార్వతిఁదలచి
భల్లాణరాయుని భక్తిశోధింపు
తెల్లమిగా నేఁడు తెలిసెనో లేదో

యాని యిట్లుచూచుట కనుపుచందమున
ననఘు చంద్రోదయ మయ్యెనంతటను
పండువెన్నెల పట్టపగలయికాయ
మండలాధిపుఁడేలు మహిఁ నొప్పుపురిని
తలవర్లు వేశ్యకై ధనములు గొంచు
వెలయుచుండు రున్నట్టివీథులకరిగి
బండారువారింటి పడఁతి రమ్మనిన
ముండజంగ మొకండు మెదలక యింట
నున్నాఁడు రాఁగూడదోయి, పొమ్మనిన
చిన్నెలవారింటిచిన్ని, రమ్మనిన
నీటుగా నొకజాణ నిదురనున్నాఁడు
కూటంబు విడిచి రాఁగూడ దనంగ
బారిసంకులవారి పాపి, రమ్మనిన
రారాదు విటుఁబాసి రాను పొమ్మనిన
కనకదండెలవారిక్షామి, రమ్మనిన
ఘనతగా నొకలంజెకాఁడున్నవాఁడు
రాఁగూడ దీవేళ రాను పొమ్మనిన
మూగాలవారింటి ముత్తి రమ్మనిన

రోవెల నొక్కఁడు రూఢిగా నిచ్చి
యీవేళ నున్నాఁడు యేనురాననిన
కిన్నెరవారింటికేసి రమ్మనిన
నున్నాఁడు ననుఁగూడి యొకభక్తుఁడనిన
మద్దెలవారింటిమల్లి రమ్మనిన
యొద్దికనున్నవాఁడొక జంగమయ్య
యేటికిఁ బిలిచెద రేను రాననినఁ
బాటికుంచమువారి బామ రమ్మనిన
నీటుగా నొక్కఁడు నిద్రకున్నాఁడు
నేఁటికి నేరాను నీయాన యనిన
వారకామినులున్న వాడవాడలను
ఈరీతి నడుగుచు నిల్లిల్లు సొచ్చి
నమ్మక వెదకంగ నాతులు విటులు
నెమ్మది నుండంగ నిలువక పఁగుడి
జననాథుఁగనుఁగొని జంగమ్మవిభుఁడు
వినకుండ మెల్లన వినఁపించిరపుడు
భూరిసద్గుణ సాంద్ర భోగదేవేంద్ర
ధీరభల్లాణేంద్ర ధృతిపన్నగేంద్ర

పన్నగా నీవేలు పట్టణమందు
నిన్నాళ్లు వేశ్యలు నెటువంక జూడఁ
బడిగాపులుగఁ గాచి పడియుందురయ్యా,
పుడమిమీఁద నేఁడైన బుట్టదులంజె
యొంటినున్నది, లేదు యొక్కొక్క విటుని
నంటుకొనున్నవా రందఱిండ్ల
నీరీతి నుండఁగా నేమును వెఱచి
వారకామినిఁ దేకవచ్చితి ననిన
దలవర్లమాటలు తథ్యంబు లనక
కొలు వటు చాలించి కొంకక లేచి
గతినెన్ని యొకనల్లకంబళిఁగప్పి
ఇతరు లెవ్వరుఁ దన్ను నెఱుగరాకుండ
వారకామినులున్నవాడ వాడలకు
నారాత్రి దానేఁగి యాలంజె లిండ్ల
చాటున నిలుచుండి చప్పట్లు వినుచు,
మాటలఁజెవి యాని మఱివించురాగఁ
బాలమల్కచేతఁ బ్రొద్దులుపుచ్చు వారు
నలకలన్నియు మాని ఘులరెడువారు

పువ్వుఁబాన్పుల మీఁద భోగించువారు
పవ్వళించి సతులఁ బాయనివారు
కరకంకణాదులు ఘలు ఘల్లుమనఁగ
మరుకేళిఁ బెనఁగుచు మసలెడువారు
సిగ్గింత లేకను జీరలు విడిచి
యగ్గించి రతి సల్పియలరెడువారు
మోము మోమునఁ జేర్చి ముద్దులుగొనుచుఁ
బ్రేమచేఁ గౌఁగిళ్లఁ బ్రేరేచువారు
కొప్పులువిడి జారఁ గుచములు, నదరఁ
జిప్పిలి మయిపట్టు చెమరింపఁగాను
కరకంకణాదులు ఘలు ఘల్లు మనఁగ
మురిపంపుముంగురుల్ మోమునఁ గమ్మ
నుపరతిబాగుల నుండెడివారు
కపటంబులనుమాని కలసెడువారు,
తూగుటుయ్యేలలలోఁ దూఁగెడువారు,
తూఁగితూఁగి రతులఁదోఁగెడువారు
దివియ గంబము నాల్గుదిక్కుల వెలుఁగఁ
బవళించి తమయంగభావము నెల్ల

కానరాఁగనుజూచి స్ఖలితులై యలసి
మాడ కెప్పటియట్ల మరి యున్నవారు
నొక్కొక్క వేశ్యకు నొక్కొక్కవిటుఁడు
నక్కడఁబొల్పడి యటులున్నవారు
యెవ్వొడఁ దమతను యిరవులఁజేరి
శయ్యలపై వేడ్క శయనించువారు
లకు ముకి పక్షులలాగునఁగదిసి
ప్రకటించి చౌసీతి బంధానుగతుల
వీర్యవృద్ధులచేత వేశ్యలు దాము
కార్యస్థులై యిట్లు కామభోగముల
నున్నవారలఁజూచి యుర్వీశ్వరుండు,
వన్నెగా మఱియొక్కవాడను జూడ
నీలాగె యుండుఁగా నిల్లిల్లువెదక
నాలోన భల్లాణుఁ డటు వేఁగుదేర
లంజెకునై పొమ్ము లంజెల తల్లి
ముంజేతికి నొసంగి పొమ్మన్నఁబోక
నుండఁగా నాలంజె యూఁకించి తన్న
గొండి నొచ్చియు, వాఁడు రొదగొని మూర్ఛై

నచ్చోట నొక్కని నా లంజెతల్లి
ఇచ్చింది పస లేమయింత ప్రొద్దాయె
వెళ్లరోరి యటన్న వేశ్య యిట్లనియె
నల్లుని నోరోరి యనరా దటన్న
వాఁడేఁడఘల్లుఁడే వదిరితే పండ్ల
నూడఁదన్నుదు నన్న నుర్వీశుఁడనియె
సంతపాకలకేల సత్యశౌచములు
వింతమాటలు వింటి విశ్వేశ, యనుచు
విభూతిచేతుల వీనులు మూసి
యాభూమిఁజే దప్పి డావాడ వెడలి
తలవర్లమాటలు తథ్యంబు లయ్యె
పలికినపంతంబు పలుచనౌనేమొ?
ఎక్కడఁగలుగునో యీప్రొద్దు వేశ్య
యక్కటా నడుజాముఁ నాయెను బ్రొద్దు
అపకీర్తి సిద్ధించె నయ్యచ్చెఁ దనకుఁ
గృపలేక నామీఁదఁగీడెంచఁగలఁడు
యేమని బొంకుదు నింతి లేదయ్యె
నీమంబుబోకుండు నే శ్వేమినేర్చు

నామదిలో నేఁడు నలుకున పొడమె
సీమయేలెడు రాజసింహుండ ననుచు
బలిమి నెవ్వాతెఁ దేరఁబాపంబుయశము
పలుచఁబారును శివభక్తికిఁ గొదువ
వెలయాట లేదని విటజంగమునకు
గులసతి నిచ్చినఁ గొదువంటఁగలదు
అంటిన నంటనీ యలర నేనింట
గొంటుజంగము కియ్య కొనివచ్చినట్టి
నే నాడు వాక్యంబు నిర్వహించెదను
మానంబిదియుఁ గాని మానమె యడియు
మానంబు ప్రాణంబు మావంశమునకు
దానంబు సేయుటె ధర్మమార్గంబు
తన దేవినే తెచ్చి దర్శింతుననుచు
ఘనతతోఁ దన యింటి కడకు నేతెంచి
చల్లమాదేవిని జయ్యనఁ బిలిచి
భల్లాణుఁడిట్లనె భక్తిమార్గమున.
వింటివా నేఁడొక్క విటజంగమయ్య
తుంటవిల్తునివైరి ధూర్జటిఁబోలి
నేవున్నకొలువుకు నిగుడి యేతెంచి

దీవించి ననుఁజూచి ధీరత నిలిచి
విభూతి ధరియించి వేశ్యఁ దెమ్మనిన
బ్రాభవంబున నేను బట్నంబుజొచ్చి
తలివర్ల నమ్మక ధవళాక్షి నేను
వెలయాలిఁ దేఁబోవ విటులను గలసి
యున్నవా రొకరైన నొంటిని వేరు
నెన్నఁడు నేఁజూడ నిట్టిచిత్రంబు
పురహరుమాయ గాఁబోలును నెఱుఁగఁ
బొరుగూళ్ల కంపినఁబోయినవారు
నక్కడ నీలాగె నతివలు విటులు
నొక్కట్టియున్నవా రొంటి లేదనిరి
వ్రతము దప్పెను నేఁడు వామాక్షి నాకు
హితకరి వచ్చితివనుచు నాభక్తి
వలుచఁగాకుండ నుపాయ మేమిపుడు
వెలయాలు గావలె వే యిపుడనినఁ
జల్లమాదేవియు, శరణని పలికె
భల్లాణరాయ భూపాల శేఖరుఁడు
చరలింగమూర్తుల జాడలువినవె

ద్వితీయాశ్వాసము

చిఱుతొండభక్తుని శిశువుఁగూరగను
నడిగినభక్తులీయయ్యలుగారె
కడు వేడ్కతో మానకంజారుబిడ్డ
కూకటి గోయరాకుండరాదంచు
నాఁకతో నడిగిరీయయ్యలుగారె
యరుదెంచి తొల్లిహలాయుధు నొక్క
యరమేను నడిగిరీయయ్యలుగారె
పుడమిలోపల మున్నుఁబొదలెనిమ్మవ్వ
కొడుకును జంపియుకెలనును బోయి.
యన్నంబునడిగిన యయ్యలుగారె
నిన్ననడుగుట యెంత నీభక్తిచూడ
నేవిధి నడిగిన నిచ్చుటే ఘనత
నావిచారంబేల నరనాథ నీకు
నావిన్నపము విను నాప్రాణనాథ,
నీవుచెప్పిన మాట నే దాఁటఁగలనె
యనవుడు భల్లాణుఁ డటు సంతసిల్లి
వనిత నక్కునఁ జేర్చి వడి నిట్టులనియె
ఓకులపావని, యోకీరవాణి,

యోకల్పభూజమ, యోచంద్రవదన,
యోమీనలోచన, యోహంసగమన,
నామాటమీఱక నాపాలఁగలిగి
నేఁటికి వేశ్యవై నిలిచి జంగముఁ
గూటమీవలె నీవు కొంకక యనిన
పతిమాటఁగైకొని పద్మాయతాక్షి
హితవర్తియై మ్రొక్కి యిలనాథు కనియె
భూనాథ, నన్నింత భూషింపనేల ?
నేను నీదాసిని నీవు నాపతివి
పతిమాటఁజేసిన బరమును గలదు
పతిమాటఁజేసినఁ బరగు సత్కీర్తి
పతిమాటఁజేసినఁ బాపనం బొదవుఁ
బతిమాట మీఱినఁ బాపహేతువగు
నామానమునకును నాప్రాణమునకు
భూమీశ, కర్తవు భోక్తవు నీవు
నీమాటమీఱ నానెఱిజంగమునకు
నోమహీపతి, నన్ను నొప్పింపుమనిన
విని రాజు మూర్ఛిల్లి వేగమె తెలిసి

మనమున సంతోషమగ్నుఁడై యనియె
నీపురిలో వేశ్య లెందును లేమి
నీమాటకును నిన్ను నీయఁగావలసె
నీవంటి నిజభార్య నే నెందుఁజూడఁ
బావని, నామాటఁ బాయక నీవు
పలికినమాత్రనే పడఁతిరో, నిన్ను
నలజంగమయ్యకు నర్పింపఁదగునె!
సతిలేని పతియేల సంసారమేల
సతిలేని వ్రతమేల సద్గతియేల
ననవలసిపుడు నే నంటినిగాక
నినుఁబాసి క్షణమైన నిలువంగఁగలనె
మగువరో, నాదగు మనసుసమ్మతిగ
దగవైన యొకమాట దయచేయుమనుడు
మానినిరత్నంబు మగనితో ననియె
భూనాథ, యీతలపోఁతలు మాను
మీచిన్నివాక్యంబు లేటికి నీకు
నాచిత్త మరయఁగ నాథయడ్డితివి
సత్యసంధుఁడు హరిశ్చంద్రుండు తొల్లి

సత్యంబుఁదప్పక సన్మునికొఅకు
నాలిబిడ్డల నమ్మి యంత్యజుఁ గొలిచి
మాలఁడై వెనువెంట మధుమాంసములను
కావళ్లమోయంగఁ గరుణించి యంత
కానఁడా వారల గౌరీశ్వరుండు
నీమాట బొంకక నిర్వహించినను
సోమేశ్వరుఁడు దయఁ జూడంగఁగలఁడు
ప్రాణేశ, యీవేళ భక్తిపోకుండఁ
జెల్లించు నాకునై చింతింపవలదు
చింతలన్నియు శివచింతగాఁజేసి
యంతరంగము గట్టిమై యుండుమనిన
వారిజాక్షిని మెచ్చి వసుధేశుఁడనియె
నీరజగంధికో, నీచిత్తమంత
నోరసెడుకొఅకునై యొత్తిచూచితిని
ఇరువురిమానసం బేకమైయొప్ప
కోరినకోర్కులు కొనసాగఁగలవు
ధీరాత్మురాలైన దేవివి నీవు
ఈరూపమున నిన్ను నిచ్చితినేని

# ద్వితీయాశ్వాసము

యారాజఋషి నన్ను నదలించఁగలఁడు
వారకామినిఁదేక వసుధేశ నీవు
నూరిలోఁబతిఁబాసి యొంటిగానున్న
మగనాలిఁ దెచ్చితి మాకేలయనునో
మగువరో, నీరూపు మాని యీక్షణమె
మారారిమననురా మఱి వింతగాను
వారకామినిరూపు వనితరో, నీవు
గైకొనిరమ్మని కడకుఁ బంపినను
నాకోమలాంగియు నవనీశు మాట
విని వచ్చి యంతలో వేశ్యాత్వమూనఁ
గనుఁగొని యామల్లికాదేవి యనియె
విరహార్తిఁగొన్నట్టి విటజంగమునకు
నరనాథుఁ డడిగిన నన్నుఁబంపకయు
మెలఁతరో నీవెట్లు మేకొంటివమ్మ!
తిలకింపఁ బట్టపుదేవివైయుండి
చులకని పనులకుఁ జొర నీకుఁదగునె
వల దిట్టు లోయక్క, వారకామినిగ
నన్ను శృంగారించి నాథునికడకు

బన్నుగాఁదోఁసోని పదవమ్మ, యనిన
మల్లికాదేవిని మన్నించి చాలఁ
జల్లమాదేవియు సంప్రీతిఁబలికె
నాముద్దుచెల్లెల, నన్నుమీఁజీవి
వేమరు నీబుద్ధి వేవేలుచేసు
నీవు నైనను నేమి నేనైననేమి
యీవేళ మనభక్తి యీడేరఁజాలు
లోలాక్షి నీమాట లోఁగొనిపంప
బాలవు మిక్కిలి ప్రౌఢవు గావు
విభునికౌఁగిటఁ నన్నువిధమును గాదు
సభ దాటవిటుఁడ యీజంగమేశ్వరుఁడు
వారకాంతనివలె వంచించి చాల
కోరికదైవాఱఁ గూడుండవలయు
నేనియ్యకోనివచ్చి నిన్నంపినపుడె
ఆనరేంద్రుఁడు నన్ను నదలించఁగలఁడు
యని యిట్లు పలదని యాచల్లమాంబ
ఘనతతో వేశ్యగాఁ గైసేయఁదొడఁగె

శ్రీః

# శృంగార భల్లాణచరిత్ర

## తృతీయాశ్వాసము

మునుపటి సొమ్ములు ముదమొప్పఁ దీసి
యనువొప్ప జలకంబులాడియు జిగ్గు
వలువ మైతడి యొత్తి వరచంద్రకావి
మిలమిల పావడమీఁద సన్నంపుఁ
జలువమైజరు చీరె చక్కఁగాఁగట్టి
నెలకొన్న జాళువా నిగ్గులరవికె
గబ్బిగుబ్బలమీఁదఁ గడువేడ్కఁదొడిగి
గొబ్బునఁ దడియార్చి కొనగోళ్ల చేతఁ
గురులు చిక్కడలించి కొప్పమరించి
విరివిగ జాజిపూవిరులును దురిమి
పలుదోమి వింతగా పలుగఱచేసి
తెలివిగాఁ బూదియఁ దిలకంబుఁ దీర్చి

పరిమళగంధంబు పైనిండ నలఁది
తెరఁగొప్ప మెఱుఁగులతీగె ధరించి
పటుచంద్రసూర్యుల పాపటబొట్టు
నిటలంబుపై వ్రేల నిలిపి కర్ణములఁ
గరమొప్ప రత్నాల కమ్మలుపెట్టి
కరముల వజ్రాలకడియముల్ పెట్టి
యాణిముత్తెపుఁ బేరు నలఱుతరించి
నాణెంపుబేసరి నత్తును బెట్టి
మొళఁ జిఱుగంటల మొలనూలు గట్టి
తెలిదమ్మిఱేకులఁ దెగడెడుముద్దు
కలికికన్నుల మంచి కాటుకపెట్టి
చిలుకలకొలికియై చేతఁబూబంతిఁ
జెలువొప్పఁగాఁ దాల్చి శృంగారముగను
జెలికత్తెపై నొకచేయి వైచికొని
వరరత్నభూషణావళులు దీపింప
కరిరాజగమనయై కాళ్ల నందియలు
గల్లుగల్లని మ్రోయఁ గస్తురీవితోడ
వల్లభుముందర వచ్చి నిల్వంగఁ

జూచి రాజేంద్రుండు చోద్యంబునంది
ఈచకోరాక్షియు నీసుందరాంగి
యీవిద్రుమాధర యీకంబుకంఠి
ఈవరారోహయు నీసింహమధ్య
ఈనవరోమాళి యీనీలవేణి
ఈనగస్తనియును నీరాజహంస
ఈయలికుంతల యీపల్లవాంఘ్రి
ఈయేణనయనయు నీభీరుమధ్య
ఈ పుష్పగంధియు నీముద్దుచిలుక
ఈపద్మహస్తయు నీగజయాన
ఈపూర్ణశశిముఖి యీమోహనాంగి
నాపాలిజంగమనాథుకే తగును
అని యిట్లు వర్ణించి యతిగౌరవమున
మనసున నున్నట్టి మమతలు పాసి
కువలయాధిపుఁ డంత భవనంబు వెడలి
జవరాలిఁదోడ్కొని చక్కఁగా రాఁగఁ
గని కటకంబునఁగల కాంతలెల్ల
నినకులాధిపు మార్గ మెఱిఁగి యిట్లనిరి

భూనాథుఁడనిబుద్ధి పూరినిమేసె
నేనాఁటిజంగమో యిప్పొద్దువచ్చి
లంజెనడ్గినఁ దాను లంజెలేదనక
కొంజ కాంతనిభక్తి కొందువగాకుండ
నిల్లాలి వేశ్యఁగా నిచ్చుచున్నాఁడు
చెల్లునా యిది యేమి చిత్రమన్నారు
నొక్కఁ డెవ్వైన నేఁ డుర్వీశ్వరుండు
నక్కటా, జంగాని కతఁడేలయిచ్చు
నిద్దఱుగాఁగ నాయురుపురిసంధు
నొద్దిక చాలక యుండఁగాఁజూచి
ఇచ్చుచునున్నవాఁ డీవు డిటువంటి
కుచ్చితబత్తియుఁ గొనసాఁగఁగలదె
యిచ్చిన సిద్ధతి సీవలెఁగాని
యెచ్చొంబుగాదటె యొకతె నీయుంగ
ననుచు నిట్టులు కొంద అాడుచునుండ
మన కేల యీమాట మానుఁడన్నారు
నాజంగమయ్యయు న్నాజనవరునిఁ
దేజీలు గజములు దివ్యాంబరములు

నన్నంబు సామ్ములు నడుగనోఁగాక
యెన్నంగ వేశ్యఁదా నెటువలె నడిగె
నీరాజవరుఁడు దా నీయకొం చెట్లు
వారకామిని లేక వచ్చి యీవేళ
నాలిని దానిచ్చు టది యెంతఘనత
యాలలితాంగియు నడ్డ గింతలును
వేయక పతివెంట వేశ్యయై నడువ
నాయింతిభక్తి యెంతని యాడువారు
భక్తిమార్గంబు చేపట్టినయపుడె
భక్తుండు చెప్పినపనులు మీఱకయ
చేసిన దిల్లాలు చేయక వేఱు
చేసిన గొంతి దాఁ జిత్తినన్వారు
సతిపతి మన సొక్క చందమైన
గతిగల్గు మీఁదటఁగల్లగాదనుచు
భూజనపాలునిఁబొగడెడువారు
నీజంగమయ్యకు నిల్లాలి నిచ్చి
యందఱుఁజూడంగ హరుని మెప్పించి
పొందితోఁ గైలాసమున కేఁగఁగలరు

అని యిట్టులును గొంద అనుకొనుచుండ
ఘనతగాఁ గైకొని కిరమర్థితోడ
మాటదప్పక జంగమయ్యాసన్నిధికి
నీటుమీఱఁగఁదెచ్చి నృపుఁడిట్టులనియె:
నీకును దగినట్టి నెలంతఁ దెచ్చితిని
చేకొను విటరాజశేఖరమూర్తి
నావిని జంగంబు నరనాథుకనియె
కావోయి భల్లాణరాజవా నీవు
ఎంతసేపయ్యె నీవింతిఁ దేఁబోయి,
ఎంతైన నీయోజ నేలమానదవు
వెంగలిబుద్ధి భూవిభుఁడ నీబుద్ధి
జంగమవిటుఁడని చౌక చేసితివి
మామీఁదిచిత్తంబు మఱియేలనీకు
నీమాట నిజమని నేను నీప్రొద్దు
కరముఁగామాంధ తఁగను రెప్పలెడక
భూమీశ, నీరాకఁ బూసి చూడఁగను
కన్నులు మూఁడయ్యె కాఁక మెండయ్యె
పన్నుగా విడువక పట్టెను మేను

సగమయ్యె నీ వింత జాగుచేయఁగను
వగదప్పి మునుపటి వలపును దీఱె
నా కేల యీ వేశ్య నడుజామునయ్యె
నీ కేడ నిజభక్తి నీ కేడపాటి
పుసిగప్పుమాటలఁ బ్రొద్దుపుచ్చితివి
వసుధేశు లేయూరు వ్రతము లేయూరు
నరనాథు లేయూరు న్యాయమేయూరు
ధరణీశు లేయూరు ధర్మమేయూరు
జననాథు లేయూరు శైవ మేయూరు
మనుజేశు లేయూరు మతము లేయూరు
సుగుణాత్మురాలైన సుదతియైనఁ
దగులుకొందురుగాక దాన మీఁగలరె
ఎందుకుఁగొఱగాని యింతిని దెచ్చి
యెందుకొ మ్మనియెద వదియేల నాకు
నన నెంచి నిన్ను నే నడిగితిఁగాక
తన కేల యీ వేశ్య తపసిని నేను
బడలితివయ్య యీపడఁతిఁ దేఁబోయి
కడువేడ్క నీవైనఁ గైకొనిపొమ్ము

అని తూలఁబల్కిన నాయయ్యమాట
విని మనుజేంద్రుండు వినయోక్తిఁబలికె
నయ్యలు మీ రేమియాడినఁజెల్లు
నయ్యకుఁదెచ్చిన యంగనామణులఁ
దల్లులఁగాఁజూడ ధర్మంబుమాకుఁ
జిల్లులువోనాడఁ జెల్లునా మీకు
నాఁకలిగొన్నంత నన్న మెవ్వరికి
వీఁకతోఁగల్గునే విడనాడవలదు
మనసురా నీకొక్కమగువ గావలయు
నని యిట్లు వెదకంగ నాలస్యమయ్యె
నాతప్పు లెన్నక నాపాలఁగలిగి
యోతండ్రి, చేకొను మువిద నీవనుచుఁ
బాదంబులకు నడ్డపడి లేవకున్న
నాదేవు కరుణించి యారాజుఁజూచి
నవుమోము సేయుచు నయము మొప్పఁబలికె
నవనీశ, నిను రోయ నాఁడితిఁ గాక
నీవంటివాఁడేఁడి నిఖిలలోకములఁ
గావలెనని నాకుఁ గరమర్థిఁకోను

వేశ్యఁ దెచ్చితివయ్య వేవేలుసేయ
వేశ్య గా దిది మంచివెన్నెల సిగ్గు
నిగ్గుగా దిది మంచి నెఱతమ్మిమొగ్గ
మొగ్గగా దిది మంచి ముద్దులచిలుక
చిలుకగా దిది మంచి చిత్తజుమొల్కి
ముల్కిగా దిది మంచి ముద్దులగుమ్మ
గుమ్మగా దిది మంచి కుందనబొమ్మ
బొమ్మగా దిది మంచి పొలఁతిరత్నంబు
అని యిట్లువర్ణించి యాజంగమయ్య
వనితను గృపఁజూచి వసుధేశుకనియె
నన్నతావులు మాకు నొప్పవు నీవు
నన్నట్టిగృహమున కువిదను నన్ను
వెనువెంట దోడ్కొని వేంచేయుమనిన
జనపతి కైదండ జంగమేశునకు
నిచ్చి తామెల్లన నిరువురిఁ గొనుచు
వచ్చియుఁదపముని వాసంబునందు
నయ్యపాదంబుల నలతనర్చించి
చెయ్యనఁజేపట్టి సంభ్రమంబునను

భావించి తనయింటి పానుపుమీఁద
నేవిచారము లేక నీశ్వరుఁదెచ్చి
సవరగా గమ్మన జాజులుపఱచి
పవళింపఁజేసి భూపాలకుఁడిల్లు
వెడలివచ్చుచుఁ దనవెలఁదితో ననియెఁ
గడువేడ్క నిన్నాళ్లుఁ గౌఁగిలి తనకు
నిచ్చినట్లే యిమ్ము యియ్యక నీవు
వచ్చిన యొడయుని వదలనాడినను
ఖండింతునని చేత ఖడ్గంబుఁబట్టి
యుండెఁ దా నొకవంక నుర్వీశ్వరుండు
చల్లమాదేవియు జననాథుమాట
లల్లనఁ గైకొని యాగుఱుఁగాంచి
చల్లనిమాటల జాణతనమున
మొల్లసుగంధియై మొనసి నటింపఁ
జిన్నివెన్నెలనవ్వు చెక్కులందగను
జన్నులు మోముపై జౌకళింపగను
చూపులు శరములై సూటిగ నోరయు
తీపైన కెమ్మోవి తేనియఁ గురియ

వదనాబ్జబింబంబు వాసనల్ దొరయు
మృదువైన మైదీఁగె మెఱుపులు మెఱయు
సచలితగతిని రాయంచలజాడఁ
గచకుచభరమునఁ గానసియాడ
బంగరు చెఱఁగుల పయ్యెద జాఱ
జంగమ ముండిన సరసకుఁ జేరి
శరణార్థియనుచు నాస్వామికి మ్రొక్కి
చెఱకులు కొబ్బెర చేమబియ్యంబు
పరిమళగంధంబు ఫలరసాన్నములు
విరిజాజులును బైఁడి వెండిగిన్నియలఁ
బంచదారయు జున్నుపాలును నేయుఁ
గొంచుకవచ్చి యాగురున కర్పించి
పంచి పాగాలిచ్చి పండుటాకులను
హెచ్చుగఁ దాను జుట్టిచ్చుచు రాఁగ
తల్లితండ్రులయొద్దఁ దనయునిపగిది
మొల్లమౌ సంతోషమునఁ బాన్పుమీఁదఁ
బవళించియున్న యా పరమాత్మునకును
శివపదధ్యానినై చెలి వేడ్కమీఱఁ

బాదాల నొత్తుచుఁ బరిభాషలాడ
నాదేవుఁడును మాట లాడకయున్న
నా యొడయనితోడ నతివ యిట్లనియె
యేవిచారమును లే దేమాట లేదు
వచ్చినపని యేమి వారకామినితో
ముచ్చటలాడవు ముగుద చేఁతలను
నున్నావు రతిసేయ నొల్లవు నీవు
చిన్నవాఁడవు గావు సిగ్గునఁ బొదల
గంజెక్కియున్నావు కళలు దైవార
మిండజంగము కింత మెత్తనయేల
పోయెఁ బ్రొద్దును జాలఁ బురుషుఁడు చేయిఁ
జేయక తాఁజేయి సేయంగరాదు
గురునాథ, నాపయి కొరఁతలనెంచు
కొఱకునైయున్నావు గుట్టుతోడుతను
జంగాన కిది విటచందంబుఁగాదు
.........నన్నదరంటఁ బట్టి
శయ్యకు రాఁదీసి సగషతనొఱయఁ
జయ్యనఁ గెమ్మోవిచవి యాని కగచి

# తృతీయాశ్వాసము

చెక్కులు కొనగోరఁ జీరి చేహత్తి
ముక్కురఁ దొలఁగించి ముద్దులుపెట్టి
గళరవంబులచేతఁ గరఁగించి మనసు
గిలిగింతలను జేసి గిరికొన్న వేడ్క
మరుకేళి సల్పని మగతనం బేల
చరలింగ, లెమ్మని చరణముల్ ముట్ట
లేవకయున్న నా లేమ యిట్లనియె
సేవ యెంతైనను జేకొనుఁగాని
ఇతనికి మోహంబు నించుక లేదు
బతిమాలి లెమ్మన్నఁ బలుకకున్నాఁడు
చలికూటిపై వెన్న సామ్యమైనాఁడు
తెలతెలగాఁ దూర్పుదిశఁ గానవచ్చె
దివియలు తెలుపయ్యె దివిఁ జుక్క పొడమె
భువనబాంధవుఁ డింకఁ బొడము వేళయ్యె
విరహుల తమకంబు వేసారిపోయె
మరుకేళి లేదయ్యె మంకుజంగముకు
యెల్లవారలలోన నీవిటు బాగు
చెల్లునే భువిలోనఁ జెలఁగునయ్యలకు.

# శృంగార భిల్లాంగి చరిత్ర

నిదియేమిచోద్యమో యీశ్వరా, యనుచు
మదిలోనఁ దత్తర మందుచుఁ గదిసి
పతిచిత్తమున కెక్క బలిమినినైన
నితని నేఁ గామింతు నిట్లని తలఁచి
చట్టాడుసేతలఁ జల్లమాదేవి
పట్టెమంచముమీఁది పఱుపుపై నెక్కి
శివరాత్రి నేఁడని చేసినయట్లు
దివియగంబములు నల్దిక్కుల వెలుఁగ
మొలనూలిగంటలు మ్రోయుచుఁ జెలఁగ
సొలపుమాటలు శివస్తుతులయితనర
పుష్పొడి తెల్లనిబూదిగా నమర
కప్పురదీపంబు గంపింపఁగాను
పరిమళాదులు మించి పాఱుచు రాఁగఁ
బరిపక్వమైనట్టి ఫలరసాన్నములు
లింగనైవేద్యంబు లెసఁగఁజూపట్ట
మంగళారతులయి మణులు శోభిల్ల
హారునకుఁ దన దేహ మర్పించుకొనుచు
నరిమురివగలతో నాలింగనమ్ము

శిశువుకుఁ జన్నియ్యఁ జేరినయట్లు
శశిముఖి చేతులు సాచి సంప్రీతి
మరుకేళికిని దీయ మగువను మెచ్చి
విరుపాక్షుఁడప్పుడు విటరూపుమాని
చల్లమాదేవి హస్తములలోపలను
నెలనాళ్ల బాలుఁడై నిలిచెను శంభుఁ
డంతటనాశంభుఁ డాచల్లమాంబ
యంతరంగముగట్టి గని సోలిసోలి
చంటికి వాపోవఁ జనులు చేఁపూర
యింటిచాటున నున్నయిలనాథుఁడనియె
పుట్టుగొడ్రాలవు పొలఁతిరో, నీవు
యిట్టిచిత్రంబేమి యిపుడు వాపోవ
నాబాలుఁ డెవ్వరే యతివరో, యనిన
లోబల మెఱుఁగక లోఁతుగానకయుఁ
గడువేడ్కతో లంజెఁ గామించి వచ్చి
యొడయఁడు బాలుఁడైయుండి వాపోవు
చున్నాఁడు వీక్షింపు మోరాజవర్య,
యన్న నాభల్లాణుఁ డట చోద్యమంది

నీలకుంతలతోడ నేర్పునఁ బలికె
బాలక, యిటువంటిపనులు వల్దను ౘ
గేలున రెండుచెక్కిళ్లను వ్రేసి
పాలు వెన్నయుఁ బెట్టు బాలున కనిన
కన్నులు మూఁడును గలిగియున్నాఁడు
చిన్నదొ్రవఁడు కొట్ట స్వాంశంబు రాదు
యనినఁ గన్నులు మూఁట నలరినశివుఁడు
వినువారలకు నెల్ల వినఁ జోద్యముగను
వెట్టిగొట్టెనుజేసి వేశ్య నన్నడిగి
కట్టుఁడై మనభక్తిఁ గొనియాడుకొంటకు
వచ్చినవాఁడైన వనితరో, వేగ
నిచ్చటఁ జూచెద నీశుని దెమ్ము
అని యిట్లుపలికిన యారాజుమాట
వినియు నాద్వారంబు వెడలె నాయింతి.
పడుచు సేతలు మాని పార్వతీశ్వరుఁడు
జడలలో మిన్నేరు శశివంకపువ్వు
పునుకలమాలయుఁబొరిఁజచ్చుకన్ను
తనరిన జింకయుఁ దలమిన్నవాఁక

# తృతీయాశ్వాసము

యురగేంద్రహార ముత్తరజన్నిదంబుఁ
జెఱుత వన్నియచేల చెలువొందు భూతి
గరుడోరగామరగంధర్వయక్ష
వరసిద్ధ సన్ముని వరులు సేవింపఁ
గరమర్థి ప్రమథాదిగణములు గొలువ
మురియుచు భృంగియు ముందట నాడ
బసవేంద్రగమనుఁడై భల్లాణునకును
అసమానుఁడగుచుఁ బ్రత్యక్షమై నిలిచె
నిలిచియున్నట్టి యా నిటలాక్షుఁ జూచి
తలయూఁచి భల్లాణధరణీశ్వరుండు
సంతోషమంది సాష్టాంగుఁడై మ్రొక్కి
యెంతయుఁ గరుణతో నెదురుగానిలిచి
శరణార్థి నగచాప జంగమరూప
శరణార్థి భవదూర శమనసంహార
శరణార్థి ధవళాంగ చంద్రోత్తమాంగ
శరణార్థి శివలింగ సద్గురులింగ
నీ పాదపద్మముల్ నేఁ జూడఁగంటి
యేపార నాభక్తి యీడేరె నిపుడు

సదమలాత్మక యీశ సకల లోకేశ
పదియాఱువన్నియపసిఁడి మచ్చునను
ఒఱసినవిధమున మెఱసి నాభక్తి
మెఱువుచేసితివయ్య, మేదినీస్థలిని
యనియిట్లు తనయిద్దఱాండ్రను దాను
గొనియాడ వారలఁ గృపఁజూచి హరుఁడు
మెచ్చితి భల్లాణ, మేలు నీభక్తి
కిచ్చెద నడుగుము యేవరంబైన.
నీవంటిభక్తులు నిఖిలలోకముల
నేవంక నున్నార లెన్నిచూడగన
అడిగిన లేదు పొమ్మనక నీభక్తి
కడముట్ట నేఁటితో ఘనుఁడవు నీవు
భల్లాణరాయ భూపాలక, నీవు
నిల్లాలి వేశ్యగా నిచ్చితి ననుచు
మనసున సందియ మందెదుసుమ్మ
తనయుఁడనై యుంటి తండ్రివి నీవు
తగ నీదుకులసతి తల్లియౌ మాకుఁ
దెగువతో జెజ్జమాదేవికి సామ్య

మనుచును గృపసేసి యుభవుఁ డాలోన
వనజాక్షియగు తనవనితతో ననియెఁ
జూచితే పార్వతి, క్షోణిశుభక్తి
యాచించి వేశ్య నే నడిగినయంత
నిచ్చెదనని పోయి యింతిలేకున్నఁ
దెచ్చివేగమె తనదేవి వేశ్యగను
భావంబుఁ దాఁజేసి భక్తిమెప్పించె
నీ వీరభల్లాణుఁ డెంతసాహసుఁడు
ఇతనికి మనలోక మిత్తమె యనినఁ
బతిమాటఁ గైకొని పార్వతి పలికె
ఏణాంకధరుఁడ, నీకేభక్తుఁడైనఁ
బ్రాణంబు నిచ్చెను భాగ్యంబునిచ్చెఁ
దనయునిఁ గోరఁగాఁ దఱిగి తా నిచ్చెఁ
గానకొని శిరమును గోసియు నిచ్చె
మానంబు నిచ్చెనే మహినెవ్వఁడైన
మానంబు నిచ్చె నీ మానవాధీశుఁ
డితఁడు నిశ్చలభక్తుఁ డితఁడు సజ్జనుఁడు
ఇతనికి మనలోక మిచ్చుట మేలు

# శృంగార భల్లాణ చరిత్ర

అనిన యంబికమాట హరుఁడు హర్షించె
వనజభవాదులు వర్ణనసేయ
జగజంపుగొడుగులు జననాథునకును
డెగువతోఁ బట్టిన తెఱఁగున వెలసి
పదివేల కిరణాల బాగున వెలుఁగు
చెదయమొందెను భానుఁ డుదయాద్రిపైని
కలువలు ముకుళించెఁ గమలము ల్విరిసె
కలపక్షిరవములు గగనంబు ముట్టె
దేవదుందుభులును దివి నుండి మ్రోసె
భూవలయంబునఁ బుష్పముల్ కురిసె
నెల్లవారలుఁ దల లెత్తి చూడఁగను
భల్లాణరాయనిపడఁతు లిద్దఱిని
పసిఁడి విమానంబు పైన నెక్కించి
బసవేంద్రగమనుఁడై భల్లాణుతోడ
నీలోకమున నుండి యీశ్వరమూర్తి
కైలాసమున కేఁగె ఘనతేజసమున
నంత నాశంభుండు ఆనందమునను
సంతోషచిత్తుఁడై శర్వాణి తాను

## తృతీయాశ్వాసము

భల్లాణరాయనిఁ బ్రమథులలోన
బల్లిదుగాఁ జేసి పట్టంబుఁ గట్టి
మంగళగీతముల్ మగువలు డాసి
చెంగునఁ బాడంగ శంఖముల్ మ్రోయ
బ్రహ్మాదు లిరువంక బలసి సేవింప
బ్రహ్మంబు దానయై పార్వతీశ్వరుఁడు
పరిజనంబై పెక్కు ప్రమథులు గొలువ
నరిమురి సింహాసనస్థుఁడై యుండె
నని యిట్లు సూతుండు నాశౌనకాది
మునులకు వినిపించె ముదమున నట్టి
భల్లాణరాయభూపాలుని చరిత్ర
జల్లనిమాటల సరసంబుగాను
నాపాలి శ్రీగురునాథుని పేరఁ
బాప సంహారుపేరఁ పరమేశుపేర
విరివిగ శ్రీరాచపేట వెలసిన
పరమాత్మ శ్రీ వీరభద్రుని పేర
విరచించి తీకథ విశ్వంబులోనఁ
దెలిఁగొప్ప జనులెల్ల స్థిరభక్తి విన్న

# శృంగారభల్హాణచరిత్ర

వ్రాసినఁ జదివినవారల కెల్ల
భాసురంబుగ నిహపరములు గల్గు
ధారుణి యున్నాళ్లో ధర్మ మున్నాళ్లో
మేరువు యున్నాళ్లో మిగుల నన్నాళ్లు
భూచక్రమునను నీపుణ్యునిచరిత
మాచంద్రతారార్కమై యొప్పఁ గాత!

సంపూర్ణము.